పిచ్చెక్కినట్లు మేడమ్ డిఫార్గు మీదికి దూకబోయింది. కానీ అంతలోనే మేడమ్ డిఫార్గు చేతిలోని పిస్టల్ నిప్పులు కక్కింది.

ఆ మరుక్షణం పెద్దగా అరుస్తూ క్రింద పడిపోయింది లూసీ.

మేడమ్ డిఫార్గులో కసి ఆ రెండు చావులతో కొంత చల్లారింది. ఇక మిగిలింది చార్లెస్....అతనికి ఎలాగూ జైలులో శిరచ్ఛేదన తన ప్రమేయం లేకుండానే జరిగిపోతుంది.

ఆ సంఘటన తన కళ్ళతో చూడాలి....అక్కడ నుండి బయలుదేరి జైలుకు వెళ్ళింది. అక్కడ మృత్యుయంత్రం ముందు చార్లెస్ రూపంలోనున్న సిడ్నీ కార్టన్ మోకరిల్లి శిరస్సును చెక్క మీద వుంచాడు.

అక్కడ నించుని వున్న గార్డు కత్తికి కట్టిన తాడును చేతి వాచీలో టైమ్ చూసుకుని వదిలిపెడతాడు. ఆ పదునైన కత్తి సిడ్నీ కార్టన్ శిరస్సును ఖండించి మొండానికి వేరు చేస్తుంది. అది చూసిన మేడమ్ డిఫార్గులో కక్ష తీరింది.... కానీ అతను చార్లెస్సా కాదా అనే సందేహం మాత్రం మనసులో పీకుతూనే వుంది.

—)o(—